# గోపికా గీతలు

భక్తిలో అత్యుత్తమమైన భక్తి అని గోపికా భక్తిని కీర్తిస్తారు మహా భక్తుడైన నారదుల వారు. అలా ఋషితుల్యులైన ఆ గోపికలు చేసే కృష్ణ స్తుతి భగవానుని పట్ల వారికి గల నిష్కల్మష తారాస్థాయి ప్రేమ భక్తి భావనను తెలియచేస్తుంది. శ్రీ కృష్ణ పరమాత్మ కొంతసేపు గోపికలతో విహరించి తరువాత అకస్మాత్తుగా మాయమైపోతారు. ఆయనను వెదకుతూ గోపికలు విరహంలో స్వామిలో తన్మయులై స్తుతిస్తారు.



1.నీవు జనించిన కతమున

నో వల్లభ! లక్ష్మి మందనొప్పె నధికమై

నీ వెంటనె ప్రాణములిడి

నీ వార రరసెద చూపు నీ రూపంబున్.

*భావం: నాథా! నీవు పుట్టిన కారణాన గోకులంలో సిరి పెంపు సొంపారుతున్నది, అనగా సంపద అధికమైంది. నీవారందరూ నీయందే ప్రాణములను ఉంచుకుని నీకోసం వెదకుతున్నారు. దయతో నీ రూపం వీరికి చూపు.*

2. శారదకమలోదరు రుచి

చోరకమగు చూపు వలన సుందర! మిమ్ముం

గోరి వెల యీని దాసుల

ధీరత నొప్పించు టిది వధించుట గాదె.

*భావం: ఓ అందగాడా! శరత్కాలమందు వికసించిన తామరలయందలి కాంతిని అణచివేయునట్టి కాంతి గల నీ చూపు వల్ల నిన్ను వలచి జీతబత్తెము లేని దాసురాండ్రమై నిన్ను*

*కొలువ వచ్చిన మమ్ములను కొంచమైన జాలి లేక మమ్ము ధీరుడవై ఇలా బాధించడం నిజంగా చంపడమే కదా!*

**3**. విషజలంబు వలన విషధర దానవు
వలన రాల వాన వలన వహ్ని
వలన నున్న వాని వలనను రక్షించి
కుసుమ శరుని బారి గూల్ప దగునె?

*<u>భావం:</u> ఓ కృష్ణా! విషంగ్రక్కు కాళియుని విషం వలన విషపూరితమైన యమునా నదీ జలాల నుండి, సర్ప రూపుడై మమ్ము మ్రింగ వచ్చిన అఘాసురుని వల్ల, ఇంద్రుడు కురిపించిన రాళ్ళ వాన వల్ల, అడవిలో చెలరేగిన కార్చిచ్చు వల్ల, ఇంకను తక్కిన ఎన్నో ఆపదల నుండి చావకుండ మమ్ము కాపాడి ఇప్పుడు పంచబాణుని బారి కప్పగించి చంపడం నీకు న్యాయమా?*

**4**. నీవు యశోద బిడ్డడవె? నీరజ నేత్ర! సమస్త జంతు చే
తో విదితాత్మ వీశుండవు తొల్లి విరించి దలంచి లోక ర
క్షా విధ మాచరింపు మని సన్నుతి సేయంగ సత్కులంబునన్
భూవలయంబు గాన నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్.

*భావం: కమలాక్షా! నీవు కేవలం నిఖిల దేహ ధారుల బుద్ధికి సాక్షిభూతుడవైన అంతరాత్మవు. పరమేశ్వరుడివి. పూర్వం బ్రహ్మ లోక సంరక్షణం చేయడానికి ఒక ఏర్పాటు చేయమని నిన్ను స్మరించి నిన్ను ధ్యానించి వేడుకోగా భూమండలాన్ని ఉద్ధరించి రక్షించడానికి ఇలా మనోజ్ఞ స్వరూపంతో ఈ మంచి వంశంలో ఆవిర్భవించి సమస్త ప్రాణుల హృదయములందు వర్తించునట్టి సర్వ నియామకుడవైన పరబ్రహ్మవు గానీ వాస్తవము విచారించగా నీవు యశోద కొడుకువు కావు.*

5. చరణ సేవకులకు సంసార భయమును
బాపి శ్రీకరంబు పట్టు గలిగి
కామదాయియైన కర సరోజంబు మా
మస్తకముల నునిచి మనుపు మీశ!

*భావం: ఓ స్వామీ! నీ పాదాలను కొలిచే వారికి సంసారం వల్ల కలిగే భయాన్ని పోగొట్టి, మేలు కలుగ చేయుట యందు పట్టుదల కలిగి, కోరిన కోరికలను అన్నింటినీ గ్రహించునట్టిదీ, ఇచ్చునట్టిది అయిన నీ కర కమలాన్ని మా మస్తకంపై ఉంచి*

*మమ్ము కాపాడుము.*

**6. గోవుల వెంట భ్రిమ్మరుచు గొల్చిన వారల పాప సంఘముల్**

**ద్రోవగ జాలి శ్రీ దనరి దుష్ట భుజంగ ఫణా లతాగ్ర సం**

**భావితమైన నీ చరణ పద్మము చన్నుల మీద మోపి త**

**ద్భావజ పుష్పభల్ల భవ బాధ హరింపు వరింపు మాధవా!**

***భావం:** మాధవా! ఆవుల వెంట సంచరించుచూ, సేవించు వారి పాప సమూహాలను పోగొట్టగలిగీ, సిరిచే ఒప్పునదీ, క్రూరుడైన కాళియుడు అనే చెడ్డ పాము యొక్క  పడగలపై నటించేదీ అయిన అతి మృదులమైన నీ పాదాన్ని మా కుచాల మీద మోపి మాకు మన్మథుని కుసుమ శరాల వల్ల ప్రాప్తించిన బాధ పరిహరించు. మమ్ము స్వీకరించు.*

**7. బుధరంజనియును సూక్తయు**

**మధురయునగు నీదు వాణి మరగించెను నీ**

**యధరామృత సంసేవన**

**విధి సంగజ తాపమెల్ల విడిపింపగదే!**

***భావం:** పండితులను సంతోషపెట్టునదీ, చక్కని పలుకుబడి*

*కలదియు, తీయనిదీ అయిన నీ పలుకు మమ్ము నీయందు ఆసక్తి గొనునట్లు చేసింది. నీ యధరామృతం త్రాగించి మా మదన తాపమంతా తొలగించు.*

8. మగువల యెడ నీ క్రౌర్యము
దగునే? నిజ భక్త భీతి దమనుడ వకటా!
తగదు భవద్దాసులకును
నగు మొగముంజూపి కావు నళిన దళాక్షా!

*భావం: కమలాక్షా! అయ్యో! ఆడువారి పట్ల ఇంతటి క్యూరత్వం అవలంబించుట నీకు తగదు. నీవు భక్తుల భయం పోగొట్టిన వాడవు అయినందున నీకు ఇది తగిన పని కాదు. కనుక నీ దాసులమైన మాకు నీ నగుమోము చూపి మా మనస్తాపమును పోగొట్టి కాపాడుము.*

9. ఘన లక్ష్మీ యుతమై వినన్ శుభదమై కామాది విధ్వంసియై
సనకాది స్తుతమై నిరంతర తప స్సంతప్త పున్నాగ జీ
వనమై యెప్పెడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరి దా
న నిరూఢత్వము లేని వారలకు మా నారీ మనోహారకా!

*భావం: రమా మనోరమణా! గొప్ప మోక్ష సంపద*

*కూడుకున్నదియు, శ్రవణ మాత్రమున ఎంతో ఎక్కువైన శుభము లిచ్చునదియు, కామ, క్రోధ,లోభ, మోహ, మద, మాత్సర్యములు అనెడు అరిషడ్వర్గములను నిర్మూలించునట్టిదియు, సనక సనందనాది యోగీశ్వరులచే కొనియాడబడునదియు, ఎడతెగని కాయిక, వాచిక, మానసిక తపముల చేత తపించుచున్న పురుష శ్రేష్ఠులైన తపస్వులకు బ్రతుకు తెరువై యొప్పుచున్న నీ కథాసుధను భక్తితో విను వారికే పేదలకు సైతము విశేష దానము చేయవలెను అను కోరిక కలుగుచుండగా, ఎన్నెన్నో గొప్ప దానములొనర్చి ప్రసిద్ధినందని వారు గ్రోలజాలరు. అనగా సర్వకాల సర్వావస్థలయందు నిన్నే తలచుకొనునట్టి మాకు ప్రాణ దానము చేయుట యందు నీకు తలపు పుట్టకుండుట తగినదేనా?*

**10. నీ నగవులు నీచూడ్కులు**

**నీ నానా విహరణములు నీ ధ్యానంబుల్**

**నీ నర్మాలాపంబులు**

**మానసములు నాటినేడు మగుడవు కృష్ణా!**

*భావం: కృష్ణా! నీ యొక్క నవ్వులూ, నీ చూపులూ, పలువిధములైన నీ విహారాలూ, నీ ధ్యానములూ, నీ పరిహాస వచనాలూ  మా హృదయాలలో నాటుకుని నేడు మరపునకు రాక ఉన్నవి.*

**11**. ఘోష భూమి వెడలి గోవుల మేపంగ
నీరజాభమైన నీ పదములు
గసవు శిలలు దాకి కడునొచ్చునో యని
కలగు మా మనములు కమలనయన!

*భావం: కమలాక్షా! నీవు గోవులను మేపుటకై మంద నుంచి అడవికి ఆవులతో వెడలిన వేళ కమలములతో సమానమైన నీ అడుగులు, గడ్డి మొలకులు, గులక రాళ్ళు తాకి మిక్కిలి నొచ్చునని, మేము మా మనసులో విచారపడుతుంటాము.*

**12**. మాపటి వేళ నీవు వన మధ్యము వెల్వడి వచ్చి గోష్పద
ప్రాపిత ధూళి ధూసరిత భాసిత కుంతలమై సరోరుహో
ద్దీపితమైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతో

జూపి మనంబులన్ మరుని జూపుదు గాదె క్రమక్రమంబునన్.

*<u>భావం:</u> ధీర జనములలో శ్రేష్ఠుడా! నీవు ప్రతి దినము సాయంత్రము బృందావనాంతర అటవీ ప్రాంతం నుంచీ తోలుకుని వచ్చిన ధేనువుల కాలి దుమ్ము సోకి ధూసర వర్ణం పొంది ప్రకాశించెడి ముంగురులు గలదై, పద్మం వలే భాసిల్లే నీ ముఖం మాకు ప్రీతితో కనబరచి మా మనస్సులలో అంతకంతకు మరులు హత్తుకొలుపుతుంటావు కదా!*

13. భక్త కామదంబు బ్రహ్మ సేవిత మిలా
మండనంబు దు:ఖ మర్దనంబు
భద్ర కరమునైన భవదంఘ్రి యుగము మా
యురములందు రమణ! యునుప దగదె?

*<u>భావం:</u> ప్రియతమా! భక్తుల అభీష్టములు తీర్చునదీ, బ్రహ్మ చేత సేవింపబడునదీ,పుడమికే అలంకారమైనదీ, దు:ఖములను పోగొట్టునదీ, శుభములొసగి కాపాడునదీ అయిన నీ అడుగుల జంటను మా వక్షముల పైన ఉంచరాదా?*

14. సురత వర్ధనంబు శోకాపహరణంబు

**స్వనిత వంశనాళ సంగతంబు**

**నన్య రాగ జయమునైన నీ మధురాధ**

**రామృతమున దాప మార్చు మీశ!**

***<u>భావం:</u> ప్రభూ! సంభోగ ప్రీతి పెంచునదీ, శోకములను తొలగించునదీ, ఊదబడుచున్న పిల్లనగ్రోవితో కూడుకున్నదై ముద్దులందుకునేదీ, ఇతరములైన అనురాగములన్నింటినీ అతిశయించునదీ అయిన నీ తీయని కెమ్మోవి పానకముచే మా తాపం పోగొట్టుము.***

**15. నీ వడవిం బవల్ దిరుగ నీ కుటిలాలక లాలితాస్య మి**

**చ్ఛావిధి జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం**

**గావున రాత్రులైన నిను గన్నుల నెప్పుడు జూడకుండ ల**

**క్ష్మీవర! రెప్పలడ్డముగ జేసె నిదేల? విధాత క్రూరుడై.**

***<u>భావం:</u> రమా నాయకా! నీవు పగటిపూట బృందావనారణ్యంలో తిరగడం వల్ల వంపులు తిరిగిన ముంగురులచే అందాలు చిందే నీ వదనం తృప్తి తీరేటట్లు కోరుకున్న విధంగా తిలకించ లేకపోతున్నాము. అందువలన మాకు క్షణాలు యుగాలుగా***

*గడుస్తాయి. పోనీ రాత్రి వేళలందైనా ఎడ తెగకుండా చూద్దాము అని కోరుకుంటే క్రూరుడైన బ్రహ్మ దేవుడు కండ్లకు ఈ రెప్పను అడ్డంగా సృష్టించాడు కదా!*

**16**.అక్కట! బంధులున్ మగలు నన్నలు దమ్ములుం

బుత్రకాదులున్

నెక్కొని రాత్రి బోకుడన నీ మృదు గీత రవంబు వీనులన్

వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది నాథ! నీ

వెక్కడ బోయితో? యెరుంగ మీ క్రియ నిర్దయుడెందు గల్గునే?

*__భావం:__ మనో వల్లభా! చుట్టాలు, భర్తలు, అన్నలు, తమ్ములు, కొడుకులు మొదలైన వారు మమ్ము అడ్డగించి రాత్రి పూట ఇల్లు వదిలి వెళ్ళద్దని చెబుతున్నప్పటికీ వానిని లక్ష్యం చేయక మనోహరమైన నీ పాట సవ్వడి చెవులలో నిండగానే అధికమైన మోహావేశంతో పరుగు పరుగున ఇక్కడికి వచ్చాము. నీవెక్కడికేగినావో ఎరుగము. నీ వంటి దయమాలిన వాడు ఎక్కడైనా ఉంటాడా?*

**17**. మదనుడార్వంగ నీవాడు మంతనములు

నవరసాలోకనంబగు నగు మొగంబు

కమల కిరవైన మహిత వక్ష స్థలంబు

మా మనంబుల లోగొని మరపె గృష్ణ!

*భావం: ఓ కృష్ణా! ఏకాంతమున మన్మథ ఉద్రేకము కలిగేటట్లుగా నీవు పలికే వలపు లొలకే పలుకులు, నవ రసములకు ఉనికి పట్టైన నీ చూపులు, నీ మనోజ్ఞమైన చిరునవ్వుతో ఉండే మొగము, లక్ష్మికి వాస స్థానమైన నీ విశాల వక్షస్థలము, కామోద్దీపన కరాలై ఆకర్షించి మమ్ములను మురిపించాయి.*

18. అరవిందంబుల కంటె కోమలమై యందంబులై యున్న నీ

చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవగా

నెరియంబోలు నటంచు బొక్కుదుము నీ ఈ కర్కశారణ్య భూ

పరి సంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణ వ్యథం జేయదే!

*భావం: కృష్ణా! తామర పువ్వుల కంటే మెత్తనివై, సుందరములై ఒప్పుతున్న నీ అడుగులు కఠినములైన మా కుచాలపై ఆనించినప్పుడు ఆ ఒత్తిడికి నీ పాదాలు పగిలి కందిపోతాయని తపిస్తాము. అటువంటి పాదాలతో కఠినములైన అరణ్య భూములలో నీవు సలిపే సంచారం నీ ప్రియురాండ్రమైన మాకు*

*ప్రాణాంతకమైనంత తాపమును కలిగిస్తుంది.*

**19**. కట్టా! మన్మథు కోలలు  నెట్టున నోనాట బెగడి నీ

పాదంబుల్

పట్టికొనగ వచ్చిన మము నట్టనడవిని డించి పోవ న్యాయమె?

కృష్ణా!

*భావం:  అయ్యో! కృష్ణా! ఎంత సంకటం దాపురించింది?*

*మన్మథుని బాణాలు మా హృదయాలలో నాటి నివారింపరానివై*

*మమ్ము పీడించుచుండగా నీ పాదములను ఆశ్రయించి ఆ*

*బాధను పోగొట్టుకొన వచ్చాము. భయపడి నీ కాళ్ళు*

*పట్టుకోవడానికి వచ్చాము. అలాంటి మమ్ము నట్టడవి మధ్యలో*

*ఇట్లే వదిలి పెట్టి వెళ్ళడం నీకు న్యాయమా?*

**20**. హృదయేశ్వరా! మా హృదయము

మృదుతరముగ జేసి తొల్లి మిక్కిలి; కడ నీ

హృదయము కఠినము చేసెను

మదీయ సౌభాగ్య మిట్టి మందము గలదే?

*భావం: ప్రాణేశ్వరా! మా చిత్తాలను, సౌందర్య రూపమైన మా*

*అదృష్టం మిక్కిలి మెత్తనివిగా చేసి, తుదకు నీ మనసును కర్కశం కావించిన మా దురదృష్టాన్ని ఏమనుకోవాలి?*

**21**. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడి దాకి వీక వా
లమ్ముల తెట్టెముల్ వరప నడ్డము వచ్చి జయింతు వండ్రు, ని
న్నమ్మిన ముగ్ధలన్ రహిత నాథల నక్కట! నేడు రెండు మూ
డమ్ముల యేటుకా డెగువ నడ్డము రాదగదే కృపానిధీ!

*భావం: కరుణానిధీ! కృష్ణా! రాక్షసులు పూర్వం ఒక్క పెట్టున చెలరేగి దేవతా సమూహాల నెదిర్చి పట్టుదలతో వారిపై వాడి శరాలు గుప్పిస్తుంటే అడ్డుపడి రాక్షసులను శిక్షిస్తావని కొందరు అంటారు. మరి అట్టివాడవైన నిన్ను నమ్ముకున్న పడతులం మేము. పతులను పరిత్యజించి వచ్చిన వారము. అయ్యో! ఇలాంటి మమ్ములను కేవలం రెండు మూడు బాణాలు గల తుంటరి విలుకాడు వెంటాడగా అడ్డు పడవేమి?*

**22**. తియ్య విలుకాడు డీకొని
వ్రయ్యలుగా దూరనేసి వనితల మనముల్
నియ్యాన నింక నయినం
గు య్యాలింపం గదయ్య గోవింద! హరీ!

*<u>భావం:</u> ఓ గోవిందా! ముకుందా! మన్మథుడు మా మీద తలపడి మా మనస్సులు భేదిల్లి బద్దలగునట్లుగా మా గుండెలు దూరేటట్లు శరాలు ప్రయోగించి బాధించాడు. ఆడువారమైన మా మొరను ఆలకించి ఇకనైనా మమ్ము రక్షించరాదా? మేము చెప్పేది అబద్ధం కాదు.*

**<u>సూచన:</u> ఈ గీతలలోని భావాలన్నీ భౌతిక పదజాలంగా మాత్రమే చూడడం మహా దోషం. గోపికలు అనగా మహా గొప్ప సాధకులైన యోగులు. వారంతా స్వామి తో తాదాత్మ్యాన్నే కోరుకుంటున్నారు గానీ, తుచ్ఛమైన శారీరక భోగాన్ని కానే కాదు. వారు వెలిబుచ్చిన యే భావము శరీర పరిమితిలో కానే కాదు.**